ప్రకాశకుల మనవి

ఈ గ్రంథములోని పుటలలో, భగవాన్ శ్రీరమణుల దివ్య సన్నిధిలో వుండిన భక్తులు వ్రాసిన విషయములు వున్నవి. ఒక పాత తమిళ ప్రచురణ నుండి ఇవి గ్రహించబడినవి. అది భగవాన్ మెచ్చుకున్న గ్రంథము.

ఇది ప్రప్రథమంగా, భగవాన్ శ్రీరమణుల 71వ జయంతి సందర్భంగా, జనవరి 1950లో ప్రచురించారు. ఈ గ్రంథమును శ్రీజె. జయరామన్ తమిళ పాఠమునకు అనుగుణంగా వుండునట్లు, ఆమూలముగా సవరించారు.

ఈ చిన్న పుస్తకమును, ఆంధ్ర ముముక్షువుల హస్తములో వుంచగలుగుతున్నందుకు సంతోషించుచున్నాము.

ఆనందము

“ఆనందప్రాప్తికోసం 'దేహమే ఆత్మ' అనే తాదాత్మ్యమును ఏర్పరచుకొనుట వ్యర్థము. అది, మొసలి వీపుపై కూర్చుని నదిని దాటు ప్రయత్నం వంటిది. అహంత తోచగానే, మనస్సు దాని మూలమైన ఆత్మనుండి వేరుపడి, అశాంతికి లోనగును. అది ఒక రాతిని గాలిలో పైకి విసిరినట్లు వుండును. లేదా నదీ జలములవలె వుండును. రాయిగానీ, నదిగానీ తన మూలస్థానమైన భూమిని లేదా సముద్రమును చేరేవరకు శాంతిని పొందవు.

అలాగే 'మనస్సు' కూడా తిరిగి దాని మూలమును చేరి, అక్కడ విరతిని పొందినపుడే శాంతి చేకూరి, ఆనందమును పొందగలుగును. ఒక రాయిగానీ, నదీ జలములుగానీ వాటి వాటి జన్మస్థానములకు చేరుట అనివార్యము. అదే విధంగా, మనస్సు కూడా ఎపుడో ఒకపుడు దాని మూలమును తిరిగి చేరక తప్పదు.”

"ఆనందం నీ స్వభావము. అందుచేత దానిని పొందగోరుట తప్పు కాదు. దానిని బయట వెదకుట మాత్రమే తప్పు. ఎందుకంటే, 'ఆనందం' లోపల వుంది."

శ్రీరమణ మహర్షి.

ముందుమాట

మనుష్యులు సుఖప్రాప్తిని, దుఃఖవిముక్తిని అభిలషించెదరు. ఇతర జీవుల విషయం అయినా ఇంతే. మానవజాతి అంతటికి ఇది సామాన్య లక్షణం. కానీ, ఆధ్యాత్మికంగా పైకి ఎదిగిన వ్యక్తులు ఓర్పు, సహనం కలిగి, ధర్మాచరణ పరాయణులై వుంటారు. అటువంటివారితోటి సాంగత్యం చిరస్థాయిగా వుండును. సామాన్య వ్యక్తులతోటి సాహచర్యం అలా వుండదు.

అయితే, ఒక ప్రశ్న ఉదయించును. “ధర్మం అనగా ఏమిటి?" ఈ అంశం చాలా ముఖ్యమైనది. ఈ ప్రశ్నకు సమాధానం కనుగొనలేదు. ఎందుకంటే, ఏది ధర్మబద్ధమో, ఆ విషయం పరిస్థితులను బట్టి నిర్ణయింపవలసి వుంది. ఈ విషయంపై ఎంత సమగ్రమైన గ్రంథమును వ్రాసినప్పటికీ, దానిలో స్పృశింపని పరిస్థితులు ఎదురవుతూనే వుంటాయి. అయినా పరిస్థితులను సమాలోకనం చేసి, ఏది ధర్మమో నిర్ధారణ చేయు స్తోమతను ప్రసాదించగల స్థితి ఒకటివుంది. అటువంటి స్థితిని సాధించుట అందరికీ ఆవశ్యకము.

అటువంటి స్థితి ఒక్కటే. అనేకములు లేవు. ఒక్కటే అయినప్పటికీ, అది అసాధారణమగు స్థితి. మానవులు దానిని అనుభవములోకి తెచ్చుకొనుట అరుదు. అనగా అది సిద్ధంగా లేదు. ఇంతకంటే వింత అయిన సంగతి మరొకటి ఏమి కలదు? విలక్షణమైన ఆ దశను గురించి ఉపనిషత్తులు బోధించాయి. ఈ గ్రంథములో ఆ సత్యమునే, నేను నా అవగాహన మేరకు వ్రాసాను. అంతకుమించి, దీనిలో నా సొంత జ్ఞానం ఏమీ లేదు. దీనిని నా కర్తవ్యంగా భావించాను.

ఈ గ్రంథములోని అధ్యాయములన్నీ పరస్పరం అవినాభావ సంబంధం కలిగి వున్నాయి. ఆ కారణంగా, ఒక అధ్యాయంలో వుండవలసిన అంశం, మరొక అధ్యాయంలో చేర్చబడి వుండవచ్చును. అలాగే, ఏవైనా అంశములు అస్పష్టంగా వున్నట్లు తోచినచో, శ్రద్ధతో ఏకాగ్రముగా అధ్యయనం చేయవలెను. అపుడు భావం స్పష్టం అగును.

అయినా కొన్ని అంశములు ఇంకా అస్పష్టములుగానే మిగిలి పోవచ్చును. అటువంటివాటి విషయంలో, పాఠకుడు చేయదగిన పని ఒక్కటే. జ్ఞానులైనవారిని సమీపించి అడిగి, శాస్త్రగ్రంథములను పరిశీలించి తెలుసుకోవలసి వుంది. అపుడు విషయం తేటతెల్లం అగును.

ఓ జగన్మాతా! సద్గురు స్వరూపిణీ! మమ్మల్ని రక్షించుము.
రచయిత.

# సర్వము ఏకమే

## 1. ఏకత్వము

1. నీవు చూసే జగత్తు, జగత్తును చూస్తున్న నీవు (దృక్-దృశ్యములు) సమస్తము ఏకమే.

2. 'నేను, నీవు, వాడు, ఆమె, అది' అని నీవు భావించేవన్నీ ఒక్కటే.

3. చైతన్యం గల ప్రాణులుగా వేటిని నీవు భావించుచున్నావో, మరియు నేల, గాలి, నిప్పు, నీవు మొదలైన వేటిని నీవు జడములుగా భావించుచున్నావో, ఆ 'సమస్తము ఏకమే.'

4. 'సమస్తము ఏకము' అని భావించుట వలన, నీకు మేలు జరుగును. 'దేనికి అది ఒకదానికంటే మరొకటి భిన్నమైనది' అని భావించుట వలన, అటువంటి మేలు నీకు సమకూరదు. కనుక 'సర్వము ఏకమే.'

5. 'సర్వము ఏకమే' అని భావించుట నీకు మంచిది, ఇతరులకు కూడా మంచిది. అందుచేత 'సర్వము ఏకమే.'

6. "నేను వేరు", "నీవు వేరు", "వాడు వేరు" ఈ విధంగా భావించువాడు తనపట్ల ఒక విధంగాను, ఇతరులపట్ల మరొక విధంగాను వ్యవహరించును. అతడు అలా వ్యవహరించుట అనివార్యము. "నేను వేరు", "ఇతరులు వేరు" అనే తలపే బీజము. ఆ బీజమునుండే భిన్న వ్యక్తులతో, భిన్న రీతులలో వ్యవహరించే క్రియారూప వృక్షం పుట్టి వృద్ధి చెందును.

ఇతరులయందు, తనయందు గల ఏకత్వమును గ్రహించిన వ్యక్తికి, ధర్మచ్యుతి కలిగే అవకాశం ఏముంది? 'భేద దృష్టి' అనే బీజం వున్నంతవరకు, విరుద్ధ కర్మరూప పాపాచరణమునకు అనాలోచితంగా నీవు పాల్పడెదవు. కనుక భేద దృష్టిని విడనాడుము. 'సర్వము ఏకమే.'

7. "జగత్తులో వివిధ పదార్థములు వివిధ రూపములలో గోచరించుచున్నవి కదా! 'ఇవన్నీ ఒక్కటే' అని భావించుట ఎలా? ఇటువంటి జ్ఞానమును పొందే వుపాయం ఏదైనా కలదా?" అని నీవు అడుగవచ్చును. అపుడు నేను ఇలా జవాబు చెప్పెదను:

"ఒకే చెట్టుపై మనం ఆకులు, పువ్వులు, పండ్లు, కొమ్మలు మొదలైనవాటిని చూస్తున్నాము. అవన్నీ పరస్పరం భిన్నంగానే వుండును. అయినా అవన్నీ ఒకటే. అన్నీ "వృక్షం" అనే పదములోనే ఇమిడి వున్నవి. వాటికి వున్న వేరు ఒకటే, సారం ఒకటే. అదే విధంగా పదార్థములు అన్నీ, దేహములు అన్నీ, జీవతత్త్వములు అన్నీ ఒకే కుదురు నుండి వచ్చినవి. ఒకే ప్రాణశక్తి కారణంగా, చైతన్యవంతం అగుచున్నవి. కనుకనే 'సర్వము ఏకమే.'

8. ఓ సజ్జనుడా! 'సర్వము ఏకమే' అనే కథనం ఉపకారకమో, అపకారకమో నీకు నీవే యోచన చేసి చూసుకొనుము. తాను తనపట్ల ఎటువంటిఅభిమానమును కలిగి వుండునో, అటువంటి అభిమానమునే ఇతరులపట్ల కూడా కలిగి వుండవలెను. తాను ఇతరులపట్ల ఏ విధంగా వ్యవహరించునో, అదే విధంగా తనపట్ల కూడ వ్యవహరించవలెను.

ఇటువంటి దృష్టి నెలకొంటే, దాని అర్థం ఏమిటి? అటువంటి వ్యక్తి, 'ఇతరులందరూ తానే' అని ఎరిగినవాడు. "తాను" అనగా 'ఇతరులు కూడ అని ఎరిగినవాడు.' అతనికి ఇక ఏ పాపం అయినా, ఏ దోషం అయినా అంటగలదా? ఇపుడు చెప్పుము. ఏకత్వ జ్ఞానం కంటే శ్రేయోదాయకమైన విషయం మరొకటి ఏదైనా వుందా? ఏ ఇతరములు అయిన పద్ధతులు ఇంతకంటే ఎక్కువ మేలు చేకూర్చలేవని స్పష్టంగా చెప్పవచ్చును.

ఇతరులను చూసి, 'వారు తన స్వరూపమేగానీ అన్యం కాదు' అని గ్రహించిన వ్యక్తి, తనను తాను ప్రేమించినదానికంటే తక్కువగా ఇతరులను ప్రేమించ గలడా? కనుక 'సర్వము ఏకమే' అనిభావించుము. ఏకాత్మ రూపములుగా సర్వులను

ప్రేమించుము. యథార్థమునకు 'సర్వము ఏకమే.' 9. ఏకత్వ దర్శనము గలవానికి పరమ శాంతి లభించును, పావిత్ర్యము సిద్ధించును. వాటిని మరెవ్వరు పొందగలరు? అతనికి ఏ చింతలు లేవు. అందరియొక్క శ్రేయస్సు, అతని యొక్క శ్రేయస్సే. 'తల్లి ఎలా భావించును?' తన సంతానం యొక్క క్షేమమే, తల్లియొక్క క్షేమము. అయినప్పటికి, తల్లి యొక్క ప్రేమలో కొంత అసంపూర్ణత మిగిలి వుంది. తల్లి 'తాను వేరు, తన సంతానం వేరు' అని భావించును.

జ్ఞాని విషయం అలా కాదు. జ్ఞాని 'సర్వాత్మ భావం గలవాడు, సర్వము ఏకమే అని ఎరిగినవాడు.' అటువంటి జ్ఞాని యొక్క ప్రేమ, తల్లి ప్రేమకంటే కూడా అతిశయమైంది. ఏకత్వ దర్శనము ద్వారా మాత్రమే, అటువంటి ప్రేమ సిద్ధించగలదు. అందుకు మరొక మార్గం లేదు. అందుచేత 'సర్వము ఏకమే.'

10. జగత్తు యావత్తు, 'నశించని నీ శరీరం'గా భావించుము. 'యావత్ విశ్వమునకు నీవు శాశ్వతమైన జీవము'గా భావించుము. ఇలా చేయుట వలన నీకు ఏమైనా కీడు జరుగగలదా? చెప్పుము. నిరపాయమైన దారిలో ముందుకు వెళ్ళుటకు ఎవరైనా భయపడుదురా? ధైర్యం వహింపుము.

వేదములు ఈ సత్యమునే బోధించుచున్నవి. నీవు తప్ప వేరెవ్వరూ లేరు. శ్రేయస్సు అంతా నీదే. అవును. నీవు స్వయంగా శ్రేయోరూపుడవు అయ్యెదవు. నీ వలన ఇతరులు పొందే లాభం అంతా నీకు లాభమే. తన దేహమునకు, తన ఆత్మకు తాను కీడు చేసుకొనువాడు ఎవడైనా వుండునా?

దేహమునకు ఏదైనా వ్రణం లేచినచో, దానికి చికిత్స చేయుదుము. ఆ చికిత్స బాధాకరంగా వుండవచ్చును. అయినా, అది మేలు చేయుటకే చేయబడును. నీ కర్మలలో కొన్ని అలాగే వుండును. అవి లోక క్షేమమును కాంక్షించి, నీవు చేయుచుందువు. భేద దృష్టి నీలో పొడసూపదు. క్లుప్తంగా చెప్పెదను వినుము.

ఏకత్వ జ్ఞానం గల వ్యక్తి, ఏది కర్తవ్యమో అదే చేయును. నిజమునకు ఏకత్వ జ్ఞానమే, కర్మ ప్రవణుడు అగుటకు అతనిని ప్రేరేపించును. అతడు పొరబడుట అసాధ్యం. లోకంలో అతడు, కన్నుల ముందు వున్న దైవము. 'సర్వము ఒక్కటే.'

## 2. నీవు

1. 'నీవు ఎవడవు?' నీవు ఈ దేహమా? అయితే, నీవు గాఢ నిద్రలో వుండగా, నీపై ప్రాకుచున్న పామును ఎందుకు గుర్తించలేదు? అటువంటపుడు నీవు ఈ దేహము ఎలా అవుతావు? కాదు. ఎన్నటికీ కాదు. 'నీవు ఈ దేహంకంటే భిన్నమైన వాడవు' అని చెప్పవలసి వుంది.

2. నిద్రలో అపుడపుడు నీకు కల వచ్చును. ఆ కలలో నీవు మరొకనితో తాదాత్మ్యం చెందుతావు. అతడునీవు కాగలవా? కాలేవు. అయితే, నీవు మేల్కొన్న తరువాత ఆ వ్యక్తి సంగతి ఏమగును? నీవు అతడు కాదు. అంతే కాదు. 'అతడే నీవు'

అని నీవు భ్రమించినందుకు, నీవు సిగ్గుపడెదవు. 'నీవు ఆ వ్యక్తివి కానే కావు' అనేది నిశ్చితం. అతనికి భిన్నంగా వున్నవాడవు నీవు.

3. సుషుప్తి దశను ఒకసారి స్మృతికి తెచ్చుకొనుము. అప్పటి నీ స్థితి ఏమిటి? అది నీ నిజస్వరూపం కాగలదా? అటువంటి నమ్మకమును నీవు సమ్మతించవు కదా! కారణం ఏమిటి? నీవు ఆ సమయంలో అజ్ఞాన అంధకారములో మునిగి వున్నావు. నీవు ఏ స్థితిలో వున్నావో, నిన్ను తెలుసుకోనీయకుండా ఆ అజ్ఞానం నిన్ను నిరోధించుచున్నది.

అటువంటిదానితో నీవు తాదాత్మ్యం చెందగలవా? 'అదే నీవు' అని భ్రమించేంత మూర్ఖుడవు కావు కదా! నీ చుట్టూ వున్న విషయములకంటే, ప్రత్యేకంగా నీవు వున్నావు.

వాటిని తెలుసుకొనే సామర్థ్యం నీకు వుంది. అటువంటి నీ రూపం అజ్ఞానం అనిగానీ, శూన్యం అనిగానీ నీవు భావించెదవా?

అంతేగాక, అది నీ స్వభావం ఎలా అగును? కానేరదు. "ఈ స్థితి గాఢతమో రూపం. తనను తాను ఎరుగని అజ్ఞానము" అని ఎరిగి, "నేను ఇది ఎరిగిన వాడను, జ్ఞాతను" అని దృఢంగా చెప్పే నీవు అదే ఎలా అవుతావు? నీయొక్క అనుభవంగా అది వుంది. దానిని నీవు గర్హించుచున్నావు. అలా దానికి ద్రష్టగా నీవు వున్నావు. నీచే నిందింపబడిన ఆ అనుభవం, నీకు దృశ్యము. ద్రష్టవైన నీవు ఆ దృశ్యం ఎలా కాగలవు? కాబట్టి నీవు ఆ సుషుప్తి యందలి అజ్ఞాన తమోరూపుడవు కావు. నీవు తద్భిన్నుడవు.

4. 'ఈ స్థూల శరీరమే నీవు కాదు' అని చెప్పగా, నీకు దానికంటే దూరంగా వున్న మరొకటి నీవు కాగలవా? నీవు ఈ స్థూల శరీరం కాదు. ఈ శరీరమునకు అవతల వున్న ఏ ఇతర దృశ్యవస్తువులు నీవు కావు. అదే విధంగా, ఈ శరీరం లోపల గల స్వప్న శరీరం సైతం నీవు కావు. 'సుషుప్తి' అని పిలువబడే అజ్ఞాన రూపం కూడ నీవు కావు. ఈ మూడు రూపములకంటే, ఈ జగత్తుకంటే నీవు విలక్షణుడవు.

5. ఈ మూడు రూపములను రెండుగా కుదించి చెప్పవచ్చును. అన్యమైన దృశ్యమును చూచు (ఎరుగు) నట్టి దశ ఒకటి. తనను గురించి తాను ఎరుగని దశ రెండవది. మొదటి దశలో జాగ్రత్ స్వప్నములు చేరును. ఆ అవస్థల యందు విషయములను ఎరుగు జ్ఞాతగా నీవు వున్నావు.

రెండవ దశ 'సుషుప్తి' అవస్థ. ఆ దశలో నీకు అపుడు అన్యవస్తు జ్ఞానం లేకపోవుటయేగాక, నిన్ను గురించి కూడ నీకు తెలియదు. నీయొక్క అనుభవములన్నీ ఈ రెండు దశలచే పరివేష్టింపబడి వున్నాయి. ఈ రెండూ నీకు విజాతీయములే. ఈ రెండు దశలకు భిన్నమైనదే నీ స్వభావం.

6. 'ఆ సత్ స్వరూపం ఏమిటి?' అని నీవు అడుగవచ్చును. అది "తురీయము" అని పిలువబడేది. "తురీయం" అనగా నాలుగవ దశ. అలా చెప్పుటకు కారణం వుంది. 'జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలలోని నీ అనుభవములైన మూడు అవస్థలు నీకు విజాతీయములు అని, నీ స్వస్థితి నాలుగవది అని, అది ఈ మూడింటికి భిన్నమైనది' అని చెప్పబడుటచే, ఆ పేరు పెట్టబడింది. జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలు మూడింటిని కలిపి ఒకే దీర్ఘస్వప్నంగా పరిగణించిన ఎడల, నాలుగవది అయిన ఆ దశను స్వప్నము నుండి మేల్కొనుటగా చెప్పవచ్చును. ఆ విధంగా, ఆ దశ గాఢనిద్రకంటే లోతైంది, ఆంతరమైనది. అలాగే అది జాగ్రదశకంటే మిక్కిలి జాగరితమైంది. కాబట్టి నీ నిజస్థితి ఆ నాలుగవ దశ. అది జాగ్రత్, స్వప్న, సుషుప్తుల కంటే విలక్షణము. అదే నీవై వున్నావు.

7. 'ఈ తురీయం అనగా ఏమిటి?' అది జ్ఞానరూపం. దానిలో వస్తుదృష్టి వుండదు, విభజించి చూచుటవుండదు. అది 'తనను తాను జ్ఞానం' అని ఎరిగే జ్ఞానం లేని స్థితి కాదు. చెప్పదలిచింది ఏమిటంటే, ఆ తురీయ దశ జ్ఞానరూపం.

అది దృశ్యంగా మరి దేనిని ఎరుగని జ్ఞానం. అది తనను తాను ఎరుగని జ్ఞానం కాదు. దీనిని ఒక త్రుటికాలం సాక్షాత్కరింప చేసుకోగలిగినా చాలును. అటువంటివానికి సత్యం సాక్షాత్కరించును. అది నీవే అయి వున్నావు.

8. తురీయ దశాప్రాప్తి అయినవాని అనుభవం ఎలా వుండును? ఆ స్థితిలోనే శాశ్వతంగా నిలిచి వుండే అనుభవం ఎవనికి లేదు. అనగా విషయ జ్ఞాన శూన్యమైన ౹ω స్థితి అలాగే కొనసాగదు. తురీయానుభవమును పొందిన వ్యక్తి, తరువాత జాగ్రత్ దశకు తిరిగి వచ్చును, లోకమును వీక్షించును.

కానీ, ఈ జగత్తు అతనికి మునుపటి జగత్తు కాదు. 'తురీయం' అనే ఏకత్వ దర్శనం గలవానికి, ఈ సమస్తం ఏకంగా, తానుగా భాసించును. అతడు ఈ జగత్తును (ఉనికిని) ఏకత్వ జ్ఞానం (ఎరుక) కంటే భిన్నంగా భావించడు. అతడు లోపల దేనిని చూసాడో, దానినే ఇపుడు వెలుపల కూడా ఒక ప్రత్యేకమైన రీతిలో చూచును.

జాగ్రద్దశలో పూర్వం అతడు లోకములో నానాత్వమును చూసెను. ఇపుడు అలా కాదు. ఇపుడు అతడు (సారభూతమైన) ఏకత్వమును దర్శించును. ఇపుడు 'సర్వము అతడే.' అతనికంటే వేరైనది ఏదీ లేదు. అతడు కన్నులు తెరచి చూడవచ్చును. లేదా కన్నులు మూసుకొని వుండవచ్చును. పరిస్థితులు ఏ విధంగానైనా పరిణమించవచ్చును. అతని దృష్టికి అంతా ఒకే ఒక దశ. అదే 'బ్రాహ్మీస్థితి.' అది 'సహజ స్థితి, స్వస్థితి, సన్మాత్ర స్థితి.' ఆ సత్యస్థితివి నీవే.

9. ఈ దశను అధిగమించి మరేదీ లేదు. “ఆంతరం”, “బాహ్యం” అనే పదములకు ఇప్పుడు అతని దృష్టిలో అర్థం లేదు. అంతా ఒక్కటే, సర్వము ఏకమే. అతని దేహం, వాక్కు, మనస్సు ఇపుడు స్వార్థ దృష్టితో పనిచేయవు. వాని కార్యములు అనుగ్రహ పూరితములై, సర్వ జన క్షేమదాయకములై వుండును. ఖండిత రూపం అయిన “నేను” శాశ్వతంగా నశించి పోయిన దశ అది. అతనిలోని అహంత మరల తలెత్తే అవకాశమే లేదు.

ఆ కారణంగా, అతడు ఇపుడే, ఇక్కడే ముక్తిని పొందినవాడు, ముక్త పురుషుడు, జీవన్ముక్తుడు. అతని దేహం సజీవంగా వున్నది కాబట్టి, అతడు జీవించి వున్నాడనిగానీ, అతడు మరణించెననిగానీ చెప్పుటకు వీలు లేదు. అతడు నిత్యుడు, శాశ్వతుడు. అతనికంటే అన్యమైనది ఏదీ లేదు. అతడు నీవే.

10. “దైవం” అనగా ఏమిటి? 'అనుగ్రహమే' దైవం. “అనుగ్రహం” అనగా ఏమిటి? 'ఖండితమైన అహంత లేని జ్ఞానం.' అటువంటి స్థితి ఒకటి వున్నట్లు తెలుసు కొనుట ఎలా? దానిని సాక్షాత్కరింప చేసుకొనుటయే దానిని ఎరుగుట. దైవసాక్షాత్కారం పొంది, దైవంతో ఏకమైన జ్ఞానిని గురించి వేదములు కొనియాడినవి.

కనుక లోకం నుండి సరైన మేలు పొందవలెనంటే, అలాగే లోకమునకు సరైన రీతిలో మేలు ఒనరించ వలెనంటే, అటువంటి దృష్టి గల వ్యక్తి, ఏకాత్మతా సాక్షాత్కారం పొందుట అవసరం. నిజమునకు వున్నది తురీయమే. మరే దశలు లేవు. అవి అజ్ఞాన దశలో మాత్రమే గోచరించును. ఎరుక గలిగినవానికి ఒకే ఒక దశ వుంది. అది నీవే.

## 3. దైవము

1. "భగవంతుడు ఎవరు?" మనం చూసే సమస్తమును అధిగమించినవాడే 'భగవంతుడు.' జగత్తును అధిగమించిన ఆయనకు, జగత్తుకు మధ్య ఏదైనా సంబంధం వుండునా? అని ప్రశ్నిస్తే, దానికి సమాధానం ఇది:

ఇక్కడి అణువణువు ఆయనకు సంబంధించియే వుంది. ఆయనకు సంబంధించనది ఏదీ లేదు. అయితే మరొక ప్రశ్న వుంది: "భగవంతుడు జగత్తును అధిగమించి వున్నాడు అనుటలో అర్థం ఏమిటి?”

జగత్తులో మనం వున్నాము. మనం చూసే విషయములు వున్నవి. అనగా చేతనములు వున్నవి, జడములు వున్నవి. ఇవి రెండు కలిసే జగత్తు అగును. ఈ రెండు సముదాయములను సృష్టించిన ఆయనను గురించి, మనం చెప్పవలసింది ఏమిటి? ఈ రెండింటిలో చైతన్యం గల జీవులను, మనం శ్రేష్ఠములుగా భావిస్తాం.

మనకు అవగతమగు విషయం ఒక్కటే. భగవంతుడు మనం ఎరిగినవాని అన్నింటిని మించిన తత్త్వము. మన బుద్ధి అంతకుమించి ముందుకు ఏగుటకు సమర్థం కాదు. ఆ విధంగా మనలను సృష్టించిన ఆ సృష్టికర్త, మన గ్రహణశక్తిని మించినవాడు.

విషయ గ్రహణం, విషయ వర్ణణ ఈ శక్తి మనకు వుంది. కానీ, ఈ శక్తి భగవంతుని గ్రహించుటకు సమర్థం కాదు. ఆయన మన బుద్ధికి అతీతమైనవాడు.

ఆయన సర్వమును అధిగమించినవాడు. కనుక ఆయన పేరు అతీతస్థితి, సర్వాతీతుడు.

2. అయితే "దైవం మనకు ఎరుకపడవలదా?" అలా అని కాదు. దైవం మనకు ఒక విధంగా తెలియును. ఆ మాత్రం కృప మనకు చాలును. ఆయన గొప్పతనం అంతా, వైభవం అంతా మనకు అవసరం లేదు. మన దుఃఖమును తుడిచి వేయుటకు ఎంత కావలెనో, అంతమేరకు తన గొప్పతనమును ఆయన మనకు వెల్లడి చేయును.

ప్రస్తుతం మనం వున్న దశలో మనయొక్క దోషములను నివారించుటకు ఏ మేరకు అవసరమో, ఆ మేరకు తన శక్తిని ఆయన మనకు వెల్లడించును. అంతకు మించి తెలియపరచవలసిన కారణం ఏమీ ఆయనకు లేదు. అనగా మన అవసరాలను బట్టి ఆయన మనకు తెలియును. కాదు. ఆయన మనకు చిక్కి వున్నాడు. ఆయన అనంతుడే కావచ్చును. కానీ, ఆయన మనకు తెలిసిన ఒక నిర్దిష్ట పరిధిలో సైతం వున్నాడు.

3. ఆయనను మన జ్ఞాన పరిధిలోకి తీసుకొని రాగల ఆ సరిహద్దు, ఆ పొలిమేర, ఆ పరిధి ఏమిటి? ఆయనను గుర్తించుటకు కొన్ని లక్షణములు వున్నవి. అవి సచ్చిదానందములు. “సత్తు” అనగా అక్షయమైనది, నశించనిది, నిత్యము వుండేది.

ఏ క్షణంలో అయినా ఆయన లేని ఎడల, అపుడు ఒక ప్రశ్న వుదయించును. ఆయనను సంహరించేది ఎవరు? ఆయనను సృష్టించేది ఎవరు? నశించే సర్వమునకు నశించని ప్రభువు ఒకడు వున్నాడని ఊహించక తప్పదు. ఇటువంటి శాశ్వతుడు అయిన జగత్ నియంతయే 'దైవం.' అవినాశి అయిన ఆయన స్వభావమే “సత్తు.”

అయితే, ఇక “చిత్తు" అనగా ఏమిటి? “చిత్తు” అనగా జ్ఞానమును కలిగి వుండుట. ఇది సంపూర్ణ జ్ఞానం, ఇది మన అస్థిర జ్ఞానంవంటిది కాదు. విపర్యయ, దురాగ్రహ, కుతర్కములు దాని చర్యలను కళంకితం చేయలేవు. అది శుద్ధ జ్ఞానం, సరళ జ్ఞానం. మన జ్ఞానం కాదు. దానికి దైవప్రేరణ కావలెను. లేకపోతే, అది కళంకితం అగును. భగవంతుడు తరచు ఇలా బోధించును:

"నీ జ్ఞానం విపరీత జ్ఞానం, క్రమరహితం.” దైవసృష్టిలోని జడ వస్తువులలో సైతం ఎంతటి క్రమబద్ధత వుంది. దైవసృష్టిలోని క్రమబద్ధతను నిరసించి, అపహాస్యం ఒనరించిన నాస్తికుడు ఒకనికి చక్కని గుణపాఠం లభించిన దృష్టాంతం వుంది. ఆ నాస్తికుడు ఇట్లనెను:, “ఇది ఏమిటి? భగవంతుడు ఇలా ఎందుకు చేసెను? మర్రి విత్తనం ఇంత అల్పమైనది ఏమిటి? మర్రి వృక్షం అంత పెద్దది ఏమిటి?" ఆ నాస్తికునకు కలిగిన అనుభవం తెలిసిందే.

జడ వస్తువులలో ఇంతటి వ్యవస్థ ఏర్పడి వుంది అనగా, అవి ఇంతటి ప్రయోజనకరములై వున్నవి అనగా, చైతన్య శీలి అయిన ఒక కర్త వాటి వెనుక వున్నట్లు తెలుస్తూనే వున్నది. నిర్నిబంధ, నిరాతంక జ్ఞానమునకు మాత్రమే సాధ్యమైన పనిని ఒక జడవస్తువు చేయగలదా? పోనీ, మన అసమగ్ర జ్ఞానమునకు అది సాధ్యం కాగలదా? లేదు. అది జరుగని పని. అందుచేత 'భగవంతుడు' దైవం, చిత్తు కూడ.

అయితే “ఆనందం” అనగా ఏమిటి? 'అన్య' మైన దానికై కోరిక లేకుండునట్టి దశ అది. అది సంపూర్ణ శాంతి, పరమ శాంతి. ఏదైనా కోరిక వుంటే, ఆయన మనకంటే అధికుడు ఎలా అగును? ఆయన నుండి మనం ఆనందం ఎలా పొందుదుము?

తన కోరికలను తీర్చు కొనుటకు, ఆయనకు మరొక ఆశ్రయం కావలసి వచ్చును. ఆయన అటువంటివాడు అని తలంచవచ్చునా? ఆత్మతృప్తి, నిత్యతృప్తి 'ఆనంద' లక్షణము. కనుక ఆయన "ఆనందము."

ఈ మూడు "సత్తు, చిత్తు, ఆనందం" అభిన్నములు, అవిభాజ్యములు. అలా కాకపోతే, అవి విడివిడిగా అభావములు అగును. కనుకనే, భగవంతుడు "సచ్చిదానంద స్వరూపం"గా ఎరుగబడుచున్నాడు. ఇలా దైవం సర్వాతీతుడేగాక సచ్చిదానందముగా బుద్ధి గ్రాహ్యం అగుచున్నాడు.

4. తురీయ స్థితిని చేరినవాడు మాత్రమే, సమస్తమును ఏకంగా దర్శించగలడు. భగవంతుని 'సత్' స్థితి అయిన సచ్చిదానందమును యథార్థంగా తెలియగలవాడు అతడే. అతడు దైవంలో ఐక్యమై ఎలా వున్నాడో, అది మాటలచేత వర్ణించుటకు వీలు కాదు, చెవులతో వినుటకు సాధ్యం కాదు. అది సాక్షాత్కారమునకు సంబంధించిన విషయం. అటువంటి సాక్షాత్కారమునకు మార్గములు వున్నవి. ఆ పద్ధతులు ఎటువంటివో, వాటి గురించి మాట్లాడుకొన వచ్చును, నేర్చుకొనవచ్చును, ఆచరణలో పెట్టవచ్చును. మనం ఆ విధంగా దైవసాక్షాత్కారమును పొందగలము.

5. దైవమునకు పేరు లేదు. మనం ఆయనకు ఒక పేరు పెడతాము. దైవమునకు రూపం లేదు. మనం ఆయనకు ఒక రూపమును కల్పిస్తాము. దీనివలన నష్టం ఏముంది? ఏ పేరు ఆయనది కాదు? ఏ రూపం ఆయనది కాదు? ఆయన లేని శబ్దం ఏముంది, రూపం ఏముంది?

కనుక, ఆయనను గురించిన సత్యజ్ఞానం లేనపుడు, నీవు ఆయనకు నీకు నచ్చిన పేరు పెట్టుకొనవచ్చును. నీకు నచ్చిన ఏ రూపం అయినా కల్పించుకొనవచ్చును. తద్వారా ఆయనను స్మరించుటకు వీలు కలుగును. నీవైపు నుండి ఎటువంటి ప్రయత్నం లేకుండా, నీకు ఆయన కృప లభించవలెనన్న కోరిక సర్వథా వ్యర్థం. నీవు ఏ ప్రయత్నం చేయకపోయినా, ఆయన కృప లభించుట సాధ్యపడితే, అపుడు అందరూ సమానులుగానే వుండవలెను. ఇన్ని భేదములు వుండుటకు అపుడు కారణమే లేదు. భగవంతుడు మనకు సాధనా మార్గములను చూపి వున్నాడు. ప్రయత్నం చేయుము. లక్ష్యమును చేరుకొనుము. సుఖివై వుండుము.

నీ సోమరితనం వలన, నీ స్వార్థపరత్వం వలన అప్రయత్నంగా భగవంతుని కృప కావలెనని కోరుచున్నావు. అందరికి గల నియమమే నీకు కూడా వుంది. నీ ప్రయత్నములను సడలనీయవద్దు. భగవంతుని సాక్షాత్కారం ప్రయత్న సాధ్యం మాత్రమే.

6. అన్నింటికంటే ఉత్తమోత్తమమైన ప్రయత్నం ఒకటి వుంది. నామరూపాత్మకమైన భగవంతుని పట్ల గల భక్తికంటే, ఇది తక్కువదిగా గోచరించవచ్చు. అయినప్పటికీ, ఇదే వుత్తమ పూజ. సర్వప్రాణులకు మంచి, చెడ్డల విచక్షణ లేని ప్రేమను పంచి ఇచ్చుటయే ఆ "పూజ." సర్వుల పట్ల అటువంటి ప్రేమ లేకపోతే, భగవంతుని పట్ల నీకు వున్న భక్తి, ఆ భగవంతుని అవమానించుటతో సమానం అగును.

నీ వలన భగవంతునికి ఏమి ప్రయోజనం వుంది? భగవంతునిద్వారా నీవు నీ కోరికలను నెరవేర్చుకొనుటకు ప్రయత్నించుచున్నావు. 'ఆపదలో వున్నవారిని ఆదుకొని, వారి అవసరములను తీర్చుట' అనే బాధ్యతను నీవు విస్మరించుచున్నావు. దీనిని "స్వార్థం", "పాపం" అనవలెను. భగవంతుని సన్నిధానంలో ఇటువంటి స్వార్థ పరుల వలన ఏ ప్రయోజనం లేదు.

భగవంతుని సన్నిధిలో జరిగే కృత్యములన్నీ నిస్వార్థయుతములై వుండును. కనుక నీవుగమనించుము. భగవంతుడు అంతట వున్నాడు. ఏ బిందువైనా దైవ కేంద్రమే. అన్ని కేంద్రములయందు ఆయన ప్రత్యక్షమై వున్నాడు. ఆయనను నీవు ఆ విధంగా వుపాసించవలెను. అటువంటి వుత్తమ భక్తులకు మాత్రమే భగవంతుడు వశుడు అగును.

7. నీవు ఈ విధంగా నామరూపములను భగవంతునికి కల్పించి, వాటిద్వారా సర్వులపట్ల ప్రేమను వర్ధించితే, నీ మనస్సు క్రమంగా పరిపక్వ దశకు వచ్చును. నీవు ఇటువంటి సమయంలో 'సర్వ నామములు, సర్వ రూపములు భగవంతునికి చెందినవే' అనే సత్యమును ఎరిగి వున్నావు. పండు పక్వమైనకొద్దీ దాని రుచి పెరుగును.

అలాగే నీలో క్రమంగా మంచి పెరిగి, చెడు క్షీణించును. దీనిని నీవే గమనించెదవు. ఈ విధంగా నీ మనస్సు పరిపక్వం కాగా, నీవు నీ కొరకు వెదుకుతూ నీ దగ్గరకు ఏతెంచును. సరైన సమయంలో ఇద్దరు కలుసు కొనుట సంభవించును.

అందరూ తమ తమ మార్గముల యందు ముందుకు వెళ్ళుచున్నారు. నీ యోగ్యత కారణంగా నీవు ఆయనను కలుసుకొనెదవు, ఆయనపై విశ్వాసం వుంచెదవు. నీకు సరైన దారి చూపునట్లు ఆయనలో స్పందన కలిగించెదవు. దారి చూపునట్లు ఆయనలో స్పందన కలిగించెదవు. ఆయన సూచనలు నీవు పాటించునట్లు ఆయనయే నిన్ను ప్రేరేపించును. అది భగవంతుని చేరుటకు సూటిదారి. "భగవంతుడు" అనగా తురీయ దశ. ఆ మార్గములో ముందుకు సాగిపొమ్ము. గమ్యమును చేరుకొనుము. గమ్యం 'సచ్చిదానందం.' అదే అన్నింటియొక్క సారము. అదే భగవంతుడు.

8. సద్గురువు చూపిన మార్గం అంతిమమైంది, సూటియైనది. అది ఏకత్వమును గురించి తెలుపును. అది పరీక్షించి నిగ్గు తేల్చినటువంటిది. సహజమైనది, సులభమైనది, ఊహాజనితం కానిది. సద్గురూపదిష్ట మార్గంలో నీవు ప్రయాణించునపుడు, ఏ సందేహములు తలెత్తవు, ఏ భయమూ వుండదు.

భయం, సంశయములే కదా అజ్ఞాన, తమో లక్షణములు!

సద్గురువు చూపిన దారిలో ముందుకు వెళ్ళే నీకు అవరోధాలు ఎలా కలుగును? ఈ విధంగా నీవు సాగుతున్న ఆ మార్గమే, అది సరైనది అనే విశ్వాసం నీకు కలిగించగలదు. ఇక నీవు నీ గురువును కలుసుకొని, ఆయన వద్ద ఇంకా నేర్చుకొనవలసిన ఆవశ్యకత వుండదు. ఆ మార్గం నీకు, నీ గురువర్యునికి ఒకటే.

భగవంతుడు అలా చేయును. నీకంటే ముందు నీ గురువు కూడ అదే మార్గములో సాగిపోయెను. గురువు నీకు దారి చూపాడు. నీవు ఆయనను అనుసరించు చున్నావు. ఇంకా ఎందరు నీవు చూపిన ఆ దారిలో ముందుకు సాగిపోయెదరో!

కాబట్టి సత్యమును గురించిన మార్గంలో సాగేవారికి, భయసందేహములకు అవకాశం లేదు. ఒకసారి నీవు ఒక అడుగు ముందుకు వేసావా? ఇక వెనుకకు అడుగు వేయవు. సద్గురువు యొక్క సాయం, నీవు ముందుకు వేయు మొదటి అడుగువరకే పరిమితమై వుండును. సద్గురువు నీకు ఆ మార్గమును చూపినందుకు ప్రతిఫలంగా, నీవు ఆయనకు చేయవలసింది ఏమీ లేదు. సద్గురువు 'దైవదూత' అని గ్రహించుము. భగవంతుడు ఆయనను నీ వద్దకు పంపాడు. నీకు మార్గదర్శనం చేయుటకు పంపాడు.

యోగ్యుడైనవానికి ఆయన మార్గం చూపును. స్వప్రయత్నం ద్వారా లోగడ చెప్పిన మార్గం వుభయ మార్గములయందు గానీ, వానిలో ఏదో ఒకదానియందు గానీ ముందుకు వెళ్ళి పక్వచిత్తులైనవారే యోగ్యులు కాగలరు. నీవు పరిపక్వత చెందిన సమయంలో, భగవంతుడు దైవదూత అయిన గురువును పంపును అని తెలియుము.

9. శ్రద్ధతో కూడిన అభ్యాసమును “భక్తి” అంటారు. అది అజ్ఞాన దశలో జరుగును. ఆ అభ్యాసమే జ్ఞాన సహితం అయితే “జ్ఞానం” అనబడును. భక్తిలో రెండు విభాగములు వున్నవి. 'భగవంతుని నామ, రూపములను వుపాసించుట' మొదటిది. రెండవది 'కర్మ' లౌకిక వ్యవహారముల యందు నీవు అందరిపట్ల సమానంగా కలిగి వుండు ప్రేమయే "కర్మయోగం." జ్ఞానములో రెండు విభాగములు వున్నవి. సద్గురువు బోధించిన మార్గములో చేయు అభ్యాసం “యోగము.”

యోగఫలము జ్ఞానం. కనిపించనిదానిని విశ్వసించుట, తరువాత దానిని కనుగొనుట అందరికీ సహజం. విశ్వాసంలేనివారు ఎన్నటికీ దానిని కనుగొనలేరు. శ్రద్ధాళువులు ఏదో ఒకనాటికి లక్ష్యమును సాధించెదరు.

శ్రద్ధలేనివారు ఎన్నటికీ సాధించలేరు. భగవంతుని పట్ల గల శ్రద్ధ వలన నష్టం లేదు. ఈ కారణమే చాలు. నీవు నమ్మి ముందుకు సాగుటకు అది తోడ్పడును. దానితో నీకు మేలు సమకూరును. అందుకు అవసరమైన యోగ్యత నీలో పెంపొందును. నీలో శ్రద్ధ పెరుగుటకే ఈ జగత్తు ఏర్పడింది. సృష్టియొక్క ప్రయోజనం ఇదే. నీలో శ్రద్ధ వుండవలెను. అదే నిన్ను భగవంతుని వద్దకు చేర్చగలదు.

10. భగవంతుని గురించి చెప్పినదంతా నీవు విశ్వసించక పోవచ్చును. 'భగవంతుడు వున్నాడు' అని అయినా కనీసం విశ్వసించుము. ఇది చాలా శక్తివంతమైన బీజం, త్వరగా మొలకెత్తి వృద్ధి చెందే బీజం. దానిలో అనంతమైన శక్తి నిక్షిప్తమై వుంది. దాని కారణంగా, నీవు భగవంతుని తప్ప మరి దేనిని చూడలేవు. నీవు నిన్ను కూడ చూసుకొనవు. ఇది యథార్థం. సమస్తమూ భగవంతుడే.

## 4. శాంతి

1. "శాంతి" అనేది ఏమిటి? ఒకడు గాఢనిద్రలో వుండును. ఆ సమయంలో జగత్తు నిలిచే వున్నది. కానీ, నిద్రపోయిన వానికి జగత్తు గురించిన చింత ఏముంది? అతని మనస్సు శాంతంగా వుండును,సేద తీరునదై వుండును. జగత్తుతో ముఖాముఖీగా వున్నపుడు, క్రియాశీలంగా వున్నపుడు కూడ మనస్సు అదే విధంగా ప్రశాంతమై విరతిని పొందితే, అదే "[illegible]09."

2. జగత్తు మనకు ఎదురుగా వున్న సమయంలో కూడా మనస్సు అలా వుండగలదా? జగత్తు గురించి మనకు వున్న కల్పనపై ఇది ఆధారపడి వుండును. ఒకని ఆస్థిని ఎవరో దోచుకున్నారు. నీ ఆస్థిని కూడా దోచుకున్నారు.

నీ ఆస్థిని దోచినపుడు, నీ మనస్సు ఎక్కువ వ్యాకులత చెందును. ఇతరుల ఆస్థిని దోచినపుడు, నీకు అంతటి వ్యాకులత వుండదు. నీ స్వంత వస్తువుల విషయంలో కూడా ఇదే చూడవచ్చును. ఒక వస్తువు పోయినపుడు కలిగే వ్యాకులత కంటే, మరొక వస్తువు పోయినపుడు కలిగే వ్యాకులత ఎక్కువగా వుండును.

వస్తువుల పట్ల మనకు వున్న విలువను బట్టి, అది ఆధారపడి వుండును. మనస్సులో కలిగే భేదమోదముల లోని వ్యత్యాసమునకు, స్థాయీ భేదమునకు ఇదే కారణం. అన్నింటికి ఒకే రకమైన విలువను ఇచ్చుట నేర్చుకొన్న ఎడల మనస్సుకు అసాధారణమైన శాంతి లభించును. అలాగే 'సకల వస్తువులు నావే, అన్నీ నాకు విలువైనవే' అని భావించినపుడు కూడా దుఃఖకారణం వుండదు. ఎందువలన? ఒక వ్యక్తికి మనస్సులో అసలు వ్యసనం కలుగుట ఎందుకు?

వ్యసనం చెందవలసిన అవసరం కనిపించకపోతే, మనస్సుకు శాంతి చేకూరును. మరొకటి కలదు. 'తనకు ఏ వస్తువుపైనా హక్కు లేద'నీ లేదా 'ప్రతి వస్తువు నశ్వరమైనదే' అని గ్రహించినపుడు, మనస్సు స్థిమితంగా వుండును. తద్వారా శాశ్వతమైన శాంతి చేకూరును. 'సమస్త వస్తువులు ఒకే విలువ గలవి' అని భావించినచో, శాంతియే. 'శాంతి' అనేది ఒకని మనోవైఖరిపై ఆధారపడి వుండును.

3. ఈ విషయమును నేను దృష్టాంత పూర్వకంగా వివరించెదను. ఒక మనుష్యుడు స్వప్నం నుండి మేల్కొనును. స్వప్నములో గాంచిన వస్తువులకు అతడు ఇచ్చిన వివిధములైన విలువలనుబట్టి, అతని చిత్తమునకు భేదంగానీ, మోదంగానీ స్వప్నకాలములో కలుగవచ్చును. కానీ, మేల్కొన్న తరువాత స్వప్న వృత్తాంతముల వలన, అతని చిత్తం ఏ వ్యసనమునకు లోనుగాక స్తిమితంగా వుండును. ఎందుచేత? స్వప్నములోని విషయములు అన్నింటికీ సమానమైన విలువను ఇచ్చుట, చిత్తమునకు ఇప్పుడు సాధ్యపడింది. స్వప్నం ముగిసినందుకు, అతనికి ఇపుడు దుఃఖం లేదు. ఎందుచేత? అతనికి తెలుసు. 'స్వప్నం శాశ్వతం కాదు. అది మేల్కొన్న వెంటనే నశించును.'

అదే విధంగా, మనుష్యుడు 'తాను దీర్ఘ స్వప్నం అనే ఈ జగత్తు నుండి ఎపుడో ఒకపుడు మేల్కొనుట తప్పదు' అని తెలిసినచో, అతని చిత్తం నిర్వికారంగా వుండగలదు. అది ప్రశాంత చిత్త దశ. "శాంతి" అనగా ఇదే.

4. 'జగత్తుతో అతని సంబంధం విచ్ఛేదం అగున'ని దీని భావం కాదు. శాంతి, స్వస్థత ఇవి అతని మనస్సులోనే కలవు. పరిస్థితులకు అనుగుణంగా, అతని కృత్యములు మారుచుండవచ్చు. అతని చిత్తం స్వస్థమై, శాంతమై నిలిచిన తరుణంలో అతనిలో కలిగే మార్పు ఇది.

అతని మనస్సు సత్యమును గ్రహించి, నిరాసక్తంగా, నిస్సంగంగా వున్నది. శాంతిని పొందినది. అతని కృత్యములు నానా విధములుగా వున్నా, అవి ఎల్లపుడూ నిష్పక్షపాతంగా వుండును. ఇతరుల చర్యలు సైతం మారుచుండును. కానీ, అవి పక్షపాత రహితంగా వుండవు. ఇటువంటి స్వస్థచిత్తత అతనికి మాత్రమేగాక లోకమంతటికీ ఎంతో మేలు చేకూర్చును. 'శాంతి' ధర్మాచరణమునకు దారి చూపును.

5. ఒక వ్యక్తి వెలుగుతున్న దీపమును చేతబట్టి నడుచు చున్నాడు. ఆ దీపమునకు, దారిలో వున్న మిట్టపల్లములకు మధ్య వైరం ఏదైనా వుందా? వుండుటకు వీలు లేదు. కానీ, వెలుగు చీకటులు కలిసి వుండలేవు. వెలుతురు చీకటిని పారద్రోలును. ఆ వెలుగు దారిలోని మిట్ట పల్లములను ప్రకాశింప చేయును. ఆ వ్యక్తి ముందుకు, వెనుకకు, ప్రక్కకు నడుచునపుడు జాగ్రత్తగా నడచునట్లు చేయును.

“అక్కడ అది అడ్డంగా వుంది, అది నా కాలికి తగిలి గాయమైంది” అనిగానీ, లేదా “ఇక్కడ పల్లంగా వుంది, నేను జారిపడ్డాను” అనిగానీ చేయు వ్యర్థ అభియోగములకు గల కారణమును తొలగించును.

అదే విధంగా, శాంతి పొందిన తరువాత, శాంత చిత్తునకు జగత్తు పట్ల ఈర్ష్యాద్వేషములు వుండవు. జగత్ స్వభావం, జగత్తులో మనకు ఎదురయ్యే ఒడిదుడుకులు మనకు అంతకుముందు తెలియవు. అవి మనకు గోచరింపకుండా కప్పివేయు చీకటిని, శాంతభావం పారద్రోలును. మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా సర్దుబాటు చేసుకొనుటకు, శాంతి జ్యోతి సహకరించును.

అది లేని సమయంలో 'జగత్తు దుఃఖభూయిష్ఠం' అని, 'దారిలో ఎన్నో ఆటంకములు తమకు కష్టం కలిగించుచున్నవ'ని మనుష్యులు ఫిర్యాదు చేస్తుంటారు. అది ఇపుడు వుండదు. కనుక 'జగత్తు స్వప్నతుల్యం' అని గ్రహించి, పరమ శాంతిని పొందిన మనుష్యుడు 'జగత్తుతో ఎటువంటి సంబంధం లేనివాడు అని గానీ, జగత్ వ్యాపారములు వేటితోను నిమిత్తం లేనివాడు' అనిగానీ భావించుట సరి కాదు. నిజమునకు అతడే జగత్తుతో సరైన సామంజస్యం కుదిరినవాడు. జగత్తులో కర్మరతునిగా వుండుటకు అతనికే యోగ్యత కలదు. ఇలా శాంతి వలన మనుష్యులకు స్వధర్మ నిర్వహణ మార్గం సుగమం అగును.

6. 'శాంతచిత్తుడైన మనుష్యుడు' జగత్ వ్యాపారములను సంస్కరించి, సవరించి, క్రమబద్ధం ఒనరించు పనికి పూనుకొనును. అటువంటి వ్యక్తి కూడ ప్రపంచమును చూసి భయపడితే, ఇక చెప్పేది ఏముంటుంది? 'ప్రపంచం సత్యం' అని భ్రమించి, దానిని కైవసం చేసుకొనుటకై తమలో తాము కీచులాడుకొనువారిని ఎవరు సరిదిద్ద గలరు, సంస్కరించగలరు? వారు అందరు స్వార్థం యొక్క కబంధ హస్తములలో చిక్కినారు. పక్షపాతరహిత దృష్టికి, వారి స్వార్థం అవరోధమై నిల్చింది. గ్రుడ్డివానికి దారి చూపించవలెనంటే, అంధత్వ నివారణకు నేత్ర చికిత్స చేయవలెనంటే, ముందుగా అటువంటి బాధ్యత నెత్తిపై వేసుకున్న వ్యక్తి కంటిచూపు సవ్యంగా వుండవలెను. నిరంతర పరిణామ శీలమైన జగత్తు నుండి, మార్పులేని తన శాశ్వత తత్త్వమును ఎరిగినవాడై వుండవలెను, శాంతచిత్తుడై వుండవలెను.

అపుడే ప్రపంచమును సంస్కరించే సామర్థ్యం అతనికి వుండును. అటువంటివారు లోకోపకారులుగా, లోకోద్ధారకులుగా వుండి తీరుదురు. ఇందుకు కారణం వుంది. ఒక బిడ్డ జారి క్రింద పడినపుడు, ఆ బిడ్డను పైకి తీసి రక్షించని కఠినాత్ములు ఎవరైనా వుంటారా?

జగత్తులోని దుఃఖములను, కష్టములను గ్రహించి, దుఃఖితమతులైన జనులను రక్షింపబోయే జ్ఞానుల విషయం కూడా అటువంటిదే అగును. జ్ఞాని మనస్సు, శరీరముల నుండి విడివడినవాడు. అటువంటివాని మనస్సు, శరీరములు

లోకక్షేమమునకై పాటుపడుతుంటే, దాని కారణంగా కలిగే ప్రయాస, ఒత్తిడి అతనికి వుండవు. వుదాహరణకు ఒక వ్యక్తి ప్రాణం విడిచి, శవమై పడి వున్నాడు. ఆ శవం మీదుగా ఎన్ని వాహనములు వెళ్ళినా, ఆ శవమును వదలి వెళ్ళిన ప్రాణమునకు ఏ బాధ కలుగదు కదా!

అందుచేత జ్ఞాని కర్మవిముఖుడై వుండడు. కష్టములకు వెనుకాడడు. సత్యం అయిన శాంతి సమకూరినందు వలన, అతనికి ధైర్యం చేకూరింది, సమయస్ఫూర్తి లభించింది.

7. 'శాంతచిత్తం' బాహ్యమునకు వినమ్రతగా, బలహీనతగా తోచును అనేది నిజం. కానీ, కార్యరంగములో అది సమస్తమును తలదన్ని వుండును. దానికి వున్న కార్యదీక్ష, ధైర్యం మరి ఎక్కడ కనిపించదు. వాస్తవమునకు విజయం ఇటువంటి సద్గుణములపైనే ఆధారపడి వుంది. మేరు పర్వతం తలక్రిందులైనా, ఆ సంఘటన వలన శాంతచిత్తుని వదనంపై కేవలం ఒక చిరునవ్వు పొడసూపును లేదా అతడు నిర్వికారంగా వుండును.

ఇటువంటి మనఃస్థితియే వ్యావహారిక జీవనము లోను, ఆధ్యాత్మిక జీవనములోను సాయంగా వుండగలదు. శాంతచిత్తునికే నిజమైన లౌకిక ఆనందం లభించును. అటువంటివానికే బంధవిముక్తి కలుగును, బ్రహ్మానంద అనుభవం కలుగును. ఎవరికైనా, ఏ విధంగానైనా మేలు చేయుటయే "శాంతి" అని ఎరుగుము.

8. శాంతికి అవరోధములు అనేకంగా వున్నవి. అవి వ్యక్తిని పరీక్షించుటకు ఎదురగును. అవి మనల్ని ఎదుర్కొన్నపుడు, మనం చాలా జాగరూకతతో వుండవలెను.

అతి మృదుకుసుమం వంటి చిత్తశాంతిని పరిరక్షించుకోవలెను. ఆ అవరోధముల నీడ కూడా దానిపై పడరాదు. మనఃపుష్పం నలిగిపోతే, అది తన సుగంధమును, స్వచ్ఛతను, రంగును కోల్పోవును. అపుడు అది ఎందుకు పనికి రాకుండా పోవును. నీకు పనికి రాదు. ఇతరులకు ఇచ్చు కానుకగా పనికి రాదు. 'నీ మనస్సు నవవికసిత కుసుమంకంటే కోమలమైనది' అని తెలుసుకొనుము. ఈ శాంతికుసుమం ద్వారానే నీవు నీకు, ఇతరులకు, భగవంతునికి చేయవలసిన విధులను నిర్వర్తించవలసి వుంది. నీ మనస్సు ఎపుడు నిత్య నూతనంగా, స్వచ్ఛంగా వుంచుకొనుము. శాంతియే మనస్సుకు గల దివ్యానుగ్రహం.

9. స్వాత్మరూపుడు అగు భగవంతుడిని ఎడతెగక నీ మనఃపుష్పముతో అర్చింపుము. మనస్సుయొక్క సంతతి అయిన మనోవృత్తులన్నీ ఈ పూజాకార్యక్రమమును నిరీక్షించుచుండగలవు.

క్రమంగా ఆ వృత్తులన్నీ తమ ప్రేలాపనలను, నిన్ను తృప్తి పరచవలెనన్న కోరికను మట్టుపెట్టగలవు. నీ శాంతిని నిరీక్షించుచు, ఆ వృత్తులన్నీ తమ తుంటరి పనులకు, పోకిళ్ళకు స్వస్తి పలుకును. నీవు నీ ఆరాధనను తాలిమితో స్థిరంగా కొనసాగనిమ్ము. చంచలమైన చిత్తవృత్తులను చూసి వ్యాకులపడకుము. నీ స్థిర శాంతచిత్త సమ్ముఖంలో అవి శాంతించును. అలాగే జరుగనిమ్ము. శాంతి సర్వులకు కావలెను.

10. క్లుప్తంగా చెపితే, "సర్వవేదముల యందలి సారం శాంతి'యే.

## 5. కర్మ

1. కర్మలన్నీ భగవంతునివే. ప్రతి వస్తువు తనదైన ధర్మమును నిర్వర్తించవలసి వుంది. ఇది భగవంతుడు ఏర్పరచిన విధానం. ఆయన కర్తృత్వం వలన జడచేతనములు అన్నీ, తమ తమ విధులను సక్రమంగా నిర్వర్తించుచున్నవి. కర్మలన్నీ భగవంతునికి చెందినవే.

2."అందరు తమ పనులు తామే చేసుకొనుచున్నారు. దీనిలోకి భగవంతుని కర్తృత్వ ప్రసక్తి తీసుకొని వచ్చుట ఎందుకు?" అని అడుగవచ్చును. దానికి సమాధానం గలదు. మనం ముందు చైతన్యం గల ప్రాణులను గురించి

విచారిద్దాము. తరువాత జడ వస్తువులను గురించి విచారించవచ్చును. మనం చైతన్యం కలిగి వున్నాము. ముందుగా మన కర్మలు ఎవరి కర్మలో విచారిద్దాము.

ప్రస్తుతం వున్న స్థితికంటే వుత్తమ స్థితిని పొందాలని, అందుకోసం మనం కృషి చేస్తున్నాము. కానీ, మనం సాధించే ఫలితములు సమానంగా లేవు. లక్ష్యం సమానమే, ప్రయత్నం సమానమే, కానీ ఫలములలో వ్యత్యాసం ఏర్పడుతుంది. ఇందుకు కారణం ఏమిటి? ఈ సందర్భములోనే 'కర్మలన్నీ తనవే' అని భగవంతుడు తెలియచేయుచున్నాడు. లేకపోతే, అందరి పరిస్థితి సమానంగానే వుండవలెను.

పరిస్థితిలలోని ఈ వ్యత్యాసములకు మనం కారణములు చెప్పగలమా? తన స్థితి మెరుగు పరచుకోవలెనని ప్రతి వ్యక్తి అభిలషించును. అటువంటి అభిలాష లేని వ్యక్తులు ఎవరైనా గలరా? ఇతరుల పట్ల వారికి వున్న అభిప్రాయములు ఎటువంటివైనా, వారికి తమ పట్ల వున్న అభిప్రాయం మాత్రం సత్యమైనది. సమాన వుద్దేశ్యములు గల వ్యక్తుల పరిస్థితులు కూడా భిన్నములుగా వున్నవి. ఇందుకు కారణం ఒక్కటే. కర్మలన్నీ భగవంతునికి చెందినవి.

3. నీవు ఇలా ఎదురు ప్రశ్న వేయుటకు అవకాశం గలదు: "అందరికీ గల వుద్దేశ్యం ఒక్కటే అయినా, వారి పరిస్థితులు భిన్నంగా వుండవచ్చును. స్థాయీ భేదమును అనుసరించి, వారి ప్రయత్నములు కూడా భిన్న రూపములుగా వుండవచ్చును." అటువంటపుడు ఒక ప్రశ్న వుంది. "ప్రయత్నం అనగా ఏమిటి? ప్రయత్నం చేయబోవుటకు ముందు వున్న మనోవృత్తి మాత్రమే కదా?"

ఈ వృత్తులన్నిటికి మూలం ఒకటే. అది వారికి వున్న వుద్దేశ్యం. అది అందరికి సమానం. కానీ, ప్రయత్నమునకు ముందు వున్న మనోవృత్తులలో వ్యత్యాసం ఎందుకు ఏర్పడింది? ఇక్కడ కూడ 'సర్వకర్మలు తనవే' అని భగవంతుడు మనకు తెలియజేయుచున్నాడు.

4. అయినా మరొకటి చెప్పవచ్చును. వుద్దేశ్యం సమానమే అయినప్పటికీ, వ్యక్తిగత శక్తి సామర్థ్యములలోని వ్యత్యాసముల కారణంగా, ప్రయత్నములలో వ్యత్యాసములు ఏర్పడవచ్చును. ఇపుడు మరొక ప్రశ్న వుంది. 'ఈ శక్తి సామర్థ్యములకు మూలం ఎక్కడ వుంది?' అది ఆయా వ్యక్తుల మనస్సు, శరీరములతో సంబంధించి వుంది. పరిసరముల ప్రభావం కూడా వుండవచ్చును.

ఒక వ్యక్తి ప్రయత్నం చేయబోయే ముందు, ఈ అంశములన్నింటిని గురించి పరిగణనలోకి తీసుకొన వలసి వుండును. కానీ, మనస్సు, శరీరములు మొదలైనవి అతనికి కొన్ని పరిమితులను కలిపించును. వాటిని మార్చుటకు అతని శక్తి చాలదు.

స్వీయ లక్ష్యసాధన కొరకు అతడు ఏ మేరకు పూనికతో కృషి చేయవలసి వున్నదో, ఆ మేరకు అతడు క్రియాశీలుడు కావలసి వున్నా, అతడు ఆ విధంగా చేయలేడు. పరిస్థితులు అతనిని చేయనీయవు. అందుచేతనే 'సర్వకర్మలు భగవంతునివే.'

5. 'మనస్సు, శరీరం, పరిస్థితులు వీటిని క్రమంగా మెరుగు పరచుకోవచ్చును. లక్ష్యసిద్ధి కలిగే స్థాయికి పెంచుకోవచ్చును' అని చెపితే, దాని అర్థం ఏమి అగుచున్నది? ప్రస్తుతమునకు సామర్థ్యం చాలదు అనే కదా అర్థం. ఇపుడు ఏమైంది? 'సర్వకర్మలు భగవంతునివే' అని అంగీకరించినట్లు అయింది.

6. ఇక్కడ ఒక విషయం వుంది. "మనుష్యులు తమ లక్ష్యమును సాధించుకోలేక పోవుచున్నారు. దానివలన వారికి మేలు జరుగునా లేదా కీడు జరుగునా?" దానివలన తప్పక మేలు చేకూరును. ఎందుచేతనంటే, మనుష్యులలో అధిక సంఖ్యాకులు స్వార్థపరులు. 'ఈ స్వార్థపరులు పొందే విజయములు లోకక్షేమ కారకములో, కాదో' అని నీకు నీవే విచారించి చూసుకొనుము.

నీవు ఇలా అడుగవచ్చును: "నిస్వార్థపరులైన వారి ప్రయత్నములు అయినా పూర్తిగా విజయవంతములు కావలెను కదా?" వారు పైకి నిస్వార్థపరులుగా కనిపించ వచ్చును. కానీ, వారిలో కళంకములు లేకపోలేదు. అందుకు కారణం, వారికి వున్న అహంకారం. వారి (కల్పిత) నిస్వార్థ పరత్వం అహంకారమునకు దారి తీయును. వారిలో ఆధిక్య భావన పెరుగును. అటువంటి సందర్భాలలో కూడ భగవంతుడు వారి వుద్దేశ్యములను వమ్ము చేయును. వారికి గుణపాఠం నేర్పును.

"మీరు కూడ ఇతరులవంటివారే. నేను మీకు నియామకుడను" అని మరొక తరగతికి చెందిన వ్యక్తి వున్నాడు. అతడు భగవంతుని ప్రతినిధి.అతనికి స్వార్థం లేదు, అహంకారం లేదు. భగవంతుడు అతనియందు నిత్యప్రకాశమానంగా వుండును.

అనగా అతనిలో గల భగవంతుని రూపమును కప్పివేయు 'అహంతా మేఘం' అతనిలో లేదు. అతని వుద్దేశ్యములు అన్నీ నెరవేరును. కనుక అతడు సత్యసంకల్పుడు అగును. భగవంతుడు అతనిద్వారా వెలుగులు విరజిమ్మగలడు. అతనిలో అజ్ఞానాంధకారం లేనే లేదు. దైవేచ్ఛ ఏమిటో, దానిని అతడు వున్నది వున్నట్లు గ్రహించును. భగవంతుడు అటువంటివాని ద్వారా తన సృష్టియొక్క ప్రయోజనమును నెరవేర్చును. అందుచేతనే, 'సర్వకర్మలు భగవంతునివే.'

7. నీవు ఇలా అడుగవచ్చును: "సత్యసంకల్పం గల వ్యక్తి ఒక్కడు లేడా? అయినా భగవంతుని ఆశీస్సులు సర్వజనులకు సంపూర్ణంగా లభ్యం కాకూడదా?" దీనికి సమాధానములో ఒక సూక్ష్మాంశం వుంది. జ్ఞానులు అయినవారు 'సర్వకర్మలు భగవంతునివే' అని ఎరుగుదురు. 'ఇతరులకు కూడా ఈ సత్యమును తెలియజేయవలెను' అనే ఆతురతతో వారు వుంటారు.

'సర్వకర్మలు భగవంతునివే అని, మనకు సంబంధించినవి కావు' అని ఎరుగుటకంటే, మించిన శ్రేయస్సు మరొకటి లేదు. ఈ జ్ఞానములోనే భగవంతుని ఆశీస్సులు అన్నీ ఇమిడి వున్నాయి. జ్ఞానులకు వున్న సంకల్పం ఒకటే. భగవంతుని తాము సాక్షాత్కరింప చేసుకొన్నారు. తాము తెలుసుకొన్న ఆ భగవంతుని గురించి, ఆ భగవంతుని కార్యములను గురించి ఇతరులకు కూడా తెలియజేయవలసి వుంది. జ్ఞానులు అయినవారికి వుండు వుద్దేశ్యం ఇదే.

అయినా వారు "భగవంతుని గురించి ఇపుడే, ఈ క్షణములోనే తెలుసుకోండి" అని చెప్పరు. వారు జ్ఞాన సాధనా మార్గములను బోధిస్తారు. వారు లోగడ నడచిన మార్గమునే మనకు చూపిస్తారు. 'అదే మార్గంలో ముందుకు వెళ్ళవలసింద'ని ప్రబోధిస్తారు. అంతవరకే ... "మీరు తక్షణమే ముక్తిని పొందండి" అని వారు చెప్పరు.

దీనికి కారణం వుంది. 'మోక్షం' సామాన్య జనులు వెంటనే పొందగలిగేది కాదు. పోనీ, జ్ఞానులు భగవంతునితో ఇలా కూడా చెప్పరు: 'స్వామీ! ఈ మనుష్యులను వెంటనే ముక్తులను చేయుము.' జ్ఞానులు అహంతా రహితులు. "తాను ఏమి చేయవలెనో భగవంతునికి తెలుసు. ఆయన దానిని చేయగలడు" అని వారు భావిస్తారు. "భగవంతునికి నేను చెప్పవలసిన పని ఏముంది?" వారి భావన ఇలా వుండును. వారు తాము చేయవలసిన దానిని చేయుటకు కాంక్షింతురు. అలా చేసిన తమ కర్మలకు ఫలితం ఎలా వున్నా వుండవచ్చును.

దానిపట్ల వారికి ఏ కర్తృత్వ భావం లేదు. 'భగవంతుడే కర్మ ఫలములను ఒసంగువాడు' అని వారికి తెలుసు. జ్ఞానులు చేయు పని ఒకటే, 'ఈ జగత్ వ్యాపారమంతా ఇలా సాగుచున్నది. సంఘటనలు ఏవేవో జరుగుచున్నవి. వాటన్నింటిని వారు సాక్షిమాత్రులై చూస్తూ వుంటారు. తమ పనిని తాము చేస్తూ వుంటారు.'

వారు తమ సంకల్పానుసారం, ప్రపంచ వ్యవస్థను ఏర్పాటు చేయవలెనని కాంక్షించరు. అటువంటి కాంక్ష ఎందుకు వుండాలి? అది కూడా ఒక రకమైన అహంకార రూపమే. ఈ సృష్టి ఎలా వుండవలెనో, అలాగే వుంది. అంతా సవ్యంగానే వుంది. 'సర్వకర్మలు భగవంతునివే.'

8. 'తమ కర్మలన్నింటిని అధిగమించిన మహాశక్తి ఒకటి కలదు' అని వారికి తెలుసు. అటువంటపుడు 'ఇది ఇలాగే వుండవలెను (అలా వుండరాదు' అనే వ్యర్థమైన ఊహ వారికి ఎలా వుండగలదు? లేదు. వారు ఆ విధంగా ఆలోచించరు. వారు ఏది చేసినా, అది తమ ధర్మంగా భావించి చేయుదురు.

శాస్త్రములు ఇలా చెప్పుచున్నవి: "కర్మ ఒనర్చుము. కర్మఫలమును గురించి ఆలోచించవద్దు." ఒక వ్యక్తి 'తాను శాంతచిత్తుడై వుండవలెన'ని సంకల్పించుకొనును. 'తనకు క్రోధం కలుగనే కలుగకూడదు' అని నిశ్చయించుకొనును. అయినా అతనికి క్రోధం కలుగవచ్చును.

అతనికి తెలియకుండా ఇది జరుగును. అలాగే, సత్యసంకల్పులు అయిన జ్ఞానులు కూడ ప్రపంచంలో కనిపించే అసమానతలను చూసి వేదన చెంది, తమకు తెలియకుండానే ఇలా భావించవచ్చును: "హే భగవంతుడా! దీనిని సరిదిద్దుము." అటువంటి సమయములలో వారి సంకల్పం తప్పక నెరవేరును. ప్రపంచంలో జరిగే అసాధారణ సంఘటనలకు మూల కారణం ఇదే.

ప్రపంచంలో జరిగే పెనుమార్పులు కూడ, 'ఒక జ్ఞాని మనస్సులో అలవోకగా తలెత్తిన సంకల్ప ఫలమే' అని చెప్పవలెను. ఇది ప్రకృతి నియమం. దీనిని ఎవరు మార్చగలరు? 'సర్వకర్మలు భగవంతునివే.'

9. (లోకంలో) ఏది జరిగినా, అది సహజంగా ఏర్పడిన వ్యవస్థ ప్రకారమే జరుగుచున్నది. న్యాయబద్ధంగానే జరుగుచున్నది. ఏది జరిగినా, అది దైవేచ్ఛానుసారమే జరుగును. "దొంగచేత దొంగతనం చేయించునది కూడా భగవంతుడే" అని భావించుట సైతం తప్పు కాదు. ఆలోచిస్తే అదే సత్యం. ఎందుకంటే, "ఆ దొంగకు సముచితం, న్యాయం అయిన శిక్షను విధింప చేయువాడు కూడ భగవంతుడే" అనే తలపు వలన మనం విధించు శిక్ష అతిశయం కాకుండా, సమతూకంగా వుండు అవకాశం ఏర్పడును. 'సర్వకర్మలు భగవంతునివే' అనే జ్ఞానం, ఆ దొంగపట్ల మన మనస్సులో ద్వేషభావం లేకుండా చేయును.

అయినా ఒక విషయం వుంది. దొంగపట్ల ద్వేషభావం లేకపోవచ్చును. కానీ, దొంగతనం పట్ల మనకు అయిష్టత కలదు. ఇది 'సర్వకర్మలు భగవంతునివే' అనే జ్ఞానంయొక్క పర్యవసానమే. 'ఇది ఎలా?' అని నీవు అడిగెదవు.

దొంగకు కూడా దొంగతనం ఇష్టం కాదు. ఆ దొంగ అయినా తన వస్తువులను ఎవరైనా దొంగిలిస్తే ఊరకుండునా? ఊరుకోడు. 'ధర్మం మంచిది, అధర్మం చెడ్డది' అని తెలియనిది ఎవరికి? కాబట్టి 'సర్వకర్మలు భగవంతునివే' అనే జ్ఞానం వలన ప్రపంచములో ఒక సువ్యవస్థ ఏర్పడును, ధార్మిక యుగం ఆరంభం అగును. మనకు వున్న జ్ఞానం ఇంతకు మించి వెళ్ళదు. మనకు తెలిసినదానినే, మనం మరల మరల చెప్పగలం. మన జ్ఞానపరిధిని దాటి వున్న విషయముల గురించి, మనం చింతించనవసరం లేదు. ఇది కూడా భగవంతుని కర్మయే.

10. భగవంతుడు మనకు ప్రసాదించిన జ్ఞాన ఫలములో 'సర్వకర్మలు భగవంతునివే' అనే జ్ఞానం ఒకటి. "నీవు ఇలా ఎందుకు చేయుచున్నావు?" అని భగవంతుని అడిగే శక్తి మనకు లేదు. మనలోని ఈ అశక్తతకు చెందిన దశలను, సర్వమతములు అంగీకరించాయి. మనం చేసే కర్మలయొక్క ఫలములు, మనం కోరుకున్న విధంగా లేవు. కాబట్టి, 'సర్వకర్మలు భగవంతునివే' అని మనం చెప్పక తప్పదు.

మనకు అన్వయించిన నియమమే, జడవస్తువులకు సైతం అన్వయించును. జడపదార్థములకు అమలు జరిగిన నియమంకంటే, మన విషయములలో అమలు జరిగే నియమం శ్రేష్ఠంగా వుండదు. 'అంతా ఒక్కటే. సర్వకర్మలు భగవంతునివే' అని కొందరు అంగీకరించక పోవచ్చు గాక. అయినా వారు తమ అశక్తతను ఒప్పుకొంటారు. ఇదిసైతం భగవంతుని కర్మమే.

## 6. అహంభావం

1. ఓ అహంభావమా! ప్రపంచములోని సర్వానర్ధములకు కారణం నీవే. నిన్ను అణచుటకే రాజులు చట్టములు చేసారు. జ్ఞానులు సత్యమును గురించి బోధించారు. అయ్యో! అనంత కాలం నుండి వారు ఎంత ప్రయత్నించినా, అవన్నీ వ్యర్థములే అయినవి. నీవు ఎక్కడ నక్కి వుండి, మరల మరల పైకి ఎగురుచున్నావు?

నీకు అంతం లేదా? వుంది. ఎందుకు లేదు? నీ అంతం సమీపించినది. నిన్ను హతమార్చుటకు మరొక అహంకారం బయలుదేరింది. అది బ్రహ్మాహంభావం, 'అహం బ్రహ్మాస్మి' అనే అనుభవం.

2. ఓ అహంభావమా! 'నీ శత్రువు నీ జాతివాడు' అని తలంచెదవేమో కాదు. నీవు నశ్వరుడవు. అతడు శాశ్వతుడు. 'నేను', 'నీవు', 'వాడు' ఇటువంటి భేదదృష్టి కలిగి వున్న కారణంగా, నీవు 'నేను' అనే దురభిమానంతో, గర్వంతో వున్నావు. కానీ, మీ శత్రువుకు 'నేను' అనే అహంకారం లేదు. కారణం ఏమనగా, అతడు సర్వ భేదములను సమన్వయ పరచును, సమస్తమును తనలో ఇముడ్చుకొనును.

నిన్ను హతమార్చుటకు బయలుదేరినవానిగా భావించి, నీవు అతని పట్ల శత్రుత్వమును వహించావు. కానీ, అతనికి నీపట్ల ఎటువంటి శత్రుత్వము లేదు. ఎలాగంటావా? అతని సమ్ముఖంలో నీవు గోచరించవు. అతడు నిన్ను తన అవయవములలో ఒకనిగా పరిగణించును.

అతని సాన్నిధ్య మాత్రమున నీ మిథ్యాత్వం నిరూపితమై, ఆ నీ మిథ్యాత్వమే నిన్ను పరిమార్చివేయును. అతని దృష్టిలో నీవు ఎటువంటి స్వత్వము లేనివాడవు కనుక, 'నిన్ను చంపవలెను' అనే తలపు అతనికి వుండదు. కనుక అహంకారమా! అతడు నీకు శత్రువు. నీవు అతనికి శత్రువు కావు. ఒక్క మాటలో చెప్పవలెనంటే, నీవు నీకే శత్రువువు.

ఎందుకంటే, నీయొక్క లోభగుణం వలన ఆ మహాత్ముని ఎదుట నీవు విర్రవీగుచున్నావు. ఇతరత్ర చేసినట్లే, ఇక్కడ కూడా చేయుచున్నావు. ఇంతటితో నీ పని సరి. నీ జీవితం సమాప్తి అయింది. నిన్ను కబళించి, నిన్ను (లేనివానినిగా) తమోమయునిగా చేసి, ఇక బ్రహ్మ - హంభావమే సర్వవ్యాపక జ్యోతియై రాజ్యమేలును.

3.ఓ అహంకారమా! నీ దుశ్చర్యలకు అంతం లేకుండా వుంది. నీవు ఇతరులకంటే అధికునిగా వుండవలెనని, ఇతరులు నీ ముందు అధములుగా వుండవలెనని కోరెదవు. నీ కోరిక తీరేవరకు నీకు మనశ్శాంతి వుండదు. నీ తలపులు అనంతములుగా వున్నవి. 'ఏ పేరు పెట్టుకుంటే నాకు గౌరవం అధికం అగును?'; 'ఏ రూపంలో నా అందం ఇనుమడించును?'; 'నాకు ఇతరులు మ్రొక్కుచున్నారా?'; 'మారుమాట్లాడక ఇతరులు నాకు విధేయులై వున్నారా?'; 'ఇతరులు తమలో తాము మాట్లాడుకొన్నపుడు, 'నన్ను మించినవాడు లేడ'ని నన్ను గురించి అనుకొనుచున్నారా?'

ఈ విధమైన తలపులు అనంతంగా నీలో చెలరేగు చున్నవి. అయ్యో! నీ జీవితం ఎంత అశాశ్వతం! అయినా, నీ తలపులు అనంతములై ఎలా వున్నవి? లెక్కలేని ఆకాంక్షలు నీలో ఎన్ని కలవు? నీవు సాగించే దౌష్ట్యమునకు మేర వుందా?

ఇటువంటి భావములు కలిగి వుండుటలో, నీవు ఇతరులకంటే భిన్నమైనవాడు అనే భేదదృష్టి కలిగి వుండుటలో 'ఆనందం కలదు' అని నిన్ను నీవు వంచించు కొనుచున్నావు. ఇది నీకు మంచిది కాదు. ఎందుకంటావా, వినుము.

ఇతరులకు కూడా నీవలె ఇవన్నీ సమకూర్చు కొనుటకు అధికారం కలదు కదా! కోటాను కోట్ల జీవరాసులకు అందరికి సమాన భుక్తముగా వున్న దానిలో లేశమాత్రం అయిన నీ భాగం ఎంత? విషయం ఇలా వుండగా, అందరిపై ఆధిపత్యం వహించవలెనని కోరుకొనకుము. వ్యర్థమైన ఇటువంటి కోరిక వలన నీకు నీవే దుఃఖమును కొని తెచ్చుకొనుచున్నావు.

ఇతరులకు కూడా దుఃఖం కలిగించుచున్నావు. మిత్ర సమ్మితంగా నేను ఒసంగు ఈ సలహా చెవి ఒగ్గి వినుము. యథార్థం చెప్పవలెనంటే, నీవు ఎవరిని 'బద్ధ శత్రువు' అని భావించుచున్నావో, అతడే నీకు నిజమైన మిత్రుడు. నిన్ను

మంచివానిగా, గొప్పవానిగా చేయుట ఎలాగో అతనికి తెలుసు. అతనికి శరణాగతి చెందుము. ఈ బ్రహ్మాహంభావన నిన్ను శత్రువుగా చూడడు. అతడే నీకు మహోపకారి, రక్షకుడు.

4. నీవు అతనికి శరణు జొచ్చినచో, అతడు నిన్ను ఏమి చేయునో, నీవు ఇపుడు కనుగొనలేవు. నీవు కనుగొనే దారి ఏదీ నీ దగ్గర లేదు. దానిని గురించి నేను ఎంతగా వివరించినా, నీకు అది అర్థం కాదు. అది శరణాగతి చెందిన తరువాత కలిగే అనుభవమునకు సంబంధించిన విషయం. అతడు నిన్ను తనంతవానినిగా చేయును, తన స్థితికి నిన్ను లాగుకొనును, నిన్ను వున్నతుని చేయును. అంతకన్న తక్కువ ఏమీ చేయడు. కనుక నీవు నీ భవితవ్యమును గురించి ఆందోళన చెందవద్దు. సరాసరి అతనిని శరణువేడుము.

నిన్ను నీవు అతనికి సమర్పించుకొన్న మరుక్షణంలో, నిన్ను మహానందం చుట్టి వేయును. అలా జరుగనిచో, నీవు పైదొలగిపోవచ్చును.

క్షీరపానం చేసిన వ్యక్తికి, తక్షణమే పాల రుచి హాయిని గూర్చును. తరువాత ఆకలి తీరును.

అలాగే శరణాగతి ఆనందంతో మొదలై, బ్రహ్మానందానుభవంతో ముగియును. ఆ బ్రహ్మానందం సుఖదుఃఖాత్మకమైన ద్వైతమునకు అతీతమైనది. కాబట్టి నిస్సందేహంగా, నీ లక్ష్యం ఈ బ్రహ్మాహంభావనయే.

5.శరణాగతి చెందిన తరువాత, నీకు వున్న నూతన నామధేయం ఏమిటి? నీవు తప్ప, నీకు వేరుగా పేరు ఏదీ లేదు. వేదములు నిన్ను స్తుతించును. ప్రపంచం నిన్ను పొగడును. ఆధ్యాత్మిక బోధలన్నింటియొక్క తాత్పర్యం నీవే. ఇక నీకు వున్న రూపం ఏమిటి?

అన్ని రూపములు నీ రూపములే. నీ స్వరూపం కానిది ఏమీ లేదు. దేవాలయముల యందు ప్రతిష్ఠింప బడినది నీ రూపమే. ఉత్సవములు, వేడుకలు, కర్మకాండలు అన్నీ నీ కొరకే. ఇక నీ శక్తి ప్రభావమా, నీ సమక్షంలో ముందుకు ఈ లోకయాత్ర
సాగిపోవుచున్నది. ప్రతీది దాని స్థానములో అది వుంది. అది వున్నట్లు వుంది.

ఇలా వుండుట నీ వలననే. క్లుప్తంగా చెప్పవలసి వస్తే, సమస్తం నీ వైభవ గానమే, సమస్తము నీ అస్తిత్వమునకు, ఉనికికి సాక్ష్యమే. అవన్నీ అలా చేయుట వాని ధర్మం. నీకు ఇటువంటి మహోన్నత స్థితి లభించును అని నీవు కలలో అయినా భావించవు. కనుక తక్షణమే బయలుదేరుము. ఆత్మవంచనకు స్వస్తి వలుకుము. ఆ బ్రహ్మాహంభావము నీకొరకై వేచి వున్నాడు.

6. నీవు నీ స్వప్నము నుండి మేల్కొనదలుస్తావా లేదా అలా కొనసాగాలనుకుంటున్నావా? స్వప్న దృశ్యములు ఎంత కాలం నిలుచును? సోమరితనం వీడుము. పెను నిద్రను వదల్చుకొనుము. లెమ్ము, మేల్కొనుము. నీ మనోదృశ్యములనే చూస్తూ వ్యర్థంగా ఎందుకు ఊహా ప్రపంచములో విహరించెదవు? ఆ దృశ్యములను చూసేవాడు ఎవడో కనుగొనుము, చాలు.

'నీలో పొంగి, క్రుంగే ఈ దృశ్యములే (వాటిలోనే ఏదైనా) నీవు' అనే భ్రాంతికి లోను కావద్దు. మేల్కొనుము. నీవు మేల్కొన్న క్షణంలో నీకు తెలియును. 'ఈ స్వప్నం కంటే నీ జాగరితము మేలైనది' అని గ్రహించెదవు. లెమ్ము! బ్రహ్మాహంభావం నీవు మేల్కొనగా చూసి ఆనందించుటకు వేచి వున్నాడు.

7. 'ఇప్పటి నీ స్వప్నం అంతం అగున'ని భయపడవద్దు. నీవు ఒక పర్యాయం మేల్కొని చూస్తే, అదే స్వప్నమును నీవు ఇంకా మేలైన రీతిలో చూడగలవు. భ్రాంతుడవై, మత్తుడవై ఇపుడు నీవు చూచునట్లు అపుడు చూడనవసరం కలుగదు. నీ స్వప్నమును నీవు స్పష్టంగా, వినోద మాత్రంగా చూడవచ్చును. అది నీకు అపుడు భారంగా వుండదు. హాస్య ప్రసంగంగా వుండును.

స్వప్నములో నీ మనోవృత్తులే రూపం దాల్చును. నీవు మేల్కొని నీ స్వప్నమును స్వప్నమాత్రంగా చూడగలవు. స్వప్నమును జాగ్రద్దశగా చూసే
భ్రాంతిని విడనాడుము. స్వప్నమును స్వప్నంగా ఎరుగుము. అలా చూడవలెనంటే, బ్రహ్మాహంభావ దశను చేరుకొనవలెను.

8. నీ మేలు కోరి నీకు ఇదంతా చెప్పాను! నా స్వార్థం కొరకు చెప్పలేదు. కనీసం నీవు దీనిపై విశ్వాసం వుంచి, ఆచరణకు పూనుకోవలెను. దాని కారణంగా, ఏ మేలు ఒనగూరితే, దానిని విడనాడవచ్చును. ఇంతమాత్రం కూడా నీవు చేయలేవా? అసంఖ్యాకులైన జ్ఞానుల బోధనలను కూడా చెవికి ఎక్కనీయక, అవి నిష్ఫలములు అని భావించి త్రోసి వేసిన ఎడల, నేను నీకు ఎలా సాయపడగలను? ఏ స్థితి ఈ స్థితికంటే ఎక్కువ కాదు. ఇది నీ మంచికే, నీద్వారా ఇతరుల మంచికే. ఈ సత్యమును నీవు తెలుసుకొనుము. ఈ అంశములో కూడ నీ వంచనను ప్రదర్శించవద్దు. ఆచరించుము. 'బ్రహ్మాహంభావం' అనగా జ్ఞానం నీ స్వభావం.

9. ఓ అహంభావమా! నీవు ఎలా అన్నింటికి బానిసవై వుండి, దుఃఖమునకు లోనగుచున్నావో చూడుము.

నీది ఎంతటి దుఃస్థితి? అందరూ నీకు శత్రువులే! 'నాకొరకు' అని నీవు ఎపుడు చెప్పెదవో, ఇతరులు కూడా 'నా కొరకే', 'నాకొరకే' అంటారు. "నేనే గొప్పవాడను" అని నీవు అంటే, ఇతరులు వ్యతిరేకిస్తారు. "అలా ఎందుకు? మేమే గొప్ప" అంటారు.

ఇలా అందరికీ నీయందు శత్రుత్వమే వుంది. వారు పెట్టే బాధలు భరించలేక, భ్రాంతిరూపములు అయిన నీ ఊహలు అసంఖ్యాకంగా వృద్ధి చెందును. నీవు అతనికి శరణు వేడి నీ వైభవమును, మహత్త్వమును పొందవద్దా? అటువంటి స్థితికి నీవు చేరిన ఎడల నీ శత్రువులు అందరు గౌరవ భావంతో నీతో చెలిమి చేయుదురు. "ఇవన్నీ నీవే" అని నీవు చెప్పుము. ప్రతివాడు నీకు మిత్రుడే అగును. తప్పక అగును. నీకు అటువంటి ఔన్నత్యమును, ఔదార్యమును ప్రసాదించగలవాడు ఒకడు వున్నాడు. అతడే "బ్రహ్మాహంభావము."

10. నేను ఒక్కటే మాట చెప్పెదను. ఇది అహంకారంతో చెప్పే మాట కాదు. ఇది నా ధర్మం అని భావించి చెప్పుచున్నాను. ఈ మాట నేను నా మేలు గోరి లేదా నీ మేలు గోరి చెప్పుట లేదు. అందరి మేలు గోరి చెప్పుచున్నాను. "బ్రహ్మాహంభావమే సత్యం."

అనుగ్రహరూపాత్మ జ్యోతి
అవ్యాజకరుణామూర్తి
శాంతిః శాంతిః శాంతిః
ఓం తత్సత్.

## శాశ్వత జీవనము

"ఆత్మను మరచుటయే మరణం. దానిని ఎరుగుటయే జీవనం. నీవు శాశ్వత జీవనమును కోరుచున్నావు. ఎందుకు? ప్రస్తుత జీవనం (సాపేక్షంగా) భరింపరానిదై వున్నది. అది అలా ఎందుకు వుంది? అది నీ స్వభావం కాదు కనుక అలా వుంది. నీవు నిజమునకు శుద్ధాత్మ స్వరూపుడవు. కానీ నీవు దానిని దేహంతో తాదాత్మ్యం చెందుచున్నావు.

'దేహం' అనగా మనస్సుయొక్క కల్పనయే. రూపు ధరించిన తలపే 'దేహం.' మనస్సు శుద్ధాత్మ నుండి వచ్చింది. అందుచేత దేహమును మార్చితే ఏమీ కాదు. ఏ మేలు జరుగదు. కేవలం అహంత మరొక దేహమును ప్రవేశించును.

పైగా 'జీవనం' అనగా ఏమిటి? అది ఉనికి, ఎరుక అయిన ఉనికి, అది నీవే. అదే నిజమైన జీవనం. అది శాశ్వతమైంది (కాలాతీతమైంది). దేహంతో ముడిపడిన జీవనం ఉపాధిగత జీవనం. కానీ, నీవు నిరుపాధికుడవు. దేహాత్మ భావన నశించితే, నిరుపాధిక జీవనంగా నీ స్వస్వరూపమును తిరిగి పొందగలవు.

శ్రీరమణ మహర్షి.

"నేను వేరు", "నీవు వేరు", “వాడు వేరు" - ఈ విధముగా భావించువాడు తనయెడల ఒక విధముగాను, ఇతరులయెడ మరియొక విధముగాను వ్యవహరించును. అతడట్లు వ్యవహరించుట అనివార్యము. “నేను వేరు”, “ఇతరులు వేరు”, అన్న తలపే బీజము. ఆ బీజమునుండియే భిన్నవ్యక్తులతో భిన్నరీతులలో వ్యవహరించెడి క్రియారూప వృక్షముపుట్టి వృద్ధిచెందును.

ఒకే చెట్టుపై మనము ఆకులు, పూలు, పండ్లు, కొమ్మలు మొదలగు వానిని చూచుచున్నాము. అవి అన్నియు పరస్పరము భిన్నముగానే ఉండును. అయినను అవి అన్నియు ఒకటే. అన్నియు 'వృక్షము' అన్న పదములోనే ఇమిడి ఉన్నవి. వానికున్న పేరు ఒకటే. సారము ఒకటే. అదేవిధముగా పదార్థములన్నియు, దేహములన్నియు, జీవతత్త్వములన్నియు ఒకే కుదురునుండి వచ్చినవి. ఒకే ప్రాణశక్తి కారణముగా చైతన్యవంతమగుచున్నవి. కనుకనే సర్వము ఏకమే. క్లుప్తముగా చెప్పినచో, సర్వవేదముల సారము శాంతియే.

సర్వం శ్రీ రమణ పరబ్రహ్మార్పణమస్తు 🌹🌹🌹🙏